# గోలకొండపత్రిక

స్వభాను సం॥ర మాఘ శు। ౨ గురువారము


# దేశీయ పరిశ్రమాభివృద్ధి-సర్.విక్టర్ సాసూన్‌గారి సూచనలు

సర్ విక్టర సాసూన్‌గారు కొన్ని రోజులనుండి మన రాష్ట్రము నందు దేశీయ పరిశ్రమాభివృద్ధినిగురించియు, అందులో ప్రత్యేకముగా మన రాష్ట్ర పరిశ్రమాభి వృద్ధినిగురించియు కొన్ని ఉపన్యాసాలను చేసినారు ఆ ఉపన్యాసములలోని రెండువిషయములు మన భారతదేశమున అంగీకరించదగినవి కావని సరియైన విమర్శమీద కనిపించగలదు.

దేశమునందు పరిశ్రమలనుస్థాపించువారలు తాము తయారుచేయుసరకుల వంటివి విదేశములనుండి దిగుమతిచేయబడుచున్నచో వాటిపై రక్షణసుంకము లను విధించవలెనని కోరుచున్నారు. ఈవిధముగా కోరరాదనియు, పారిశ్రామికులు స్వశక్తిపై నిలువబడవలెననియు సర్‌విక్టర్ సాసూన్‌గారు నొక్కిచెప్పినారు. మన దేశమునందు పరిశ్రమాభివృద్ధిఇప్పటికిఇంకను శైశవదశను దాటలేదు. పెట్టబడిన కొద్ది పరిశ్రమలు ఇంకను కాలూని నిలువబడలేదు. క్రొత్త పరిశ్రమల నెన్నిటినో పెట్టవలసియున్నది. మనదేశమునకు సరకులను పంపించుదేశములా పరిశ్రమాభివృద్ధియందు గడితేరినవి. అక్కడి పరిశ్రమలవారలు మనదేశపు పరిశ్రమల వారలతో పోటీచేయబూనినచో మన దేశములోని పరిశ్రమలు అపోటీకితాళలేక నశించవలసివచ్చును

ఈపోటీవల్ల విదేశసరకులు చౌకగా మనదేశమందు అమ్మకము కాగలవు, కనుక ఇక దేశములో సరకులుకొనేజనులకు లాభముకదా, అంతమంది సౌకర్యమును త్రోసివేసి ఏకొద్దిమందిరో అయినపరిశ్రమల యజమానుల లాభములకు ప్రభుత్వము వారు తోడ్పడుట ధర్మమాయని సర్ విక్టర్ సాసూన్‌గారన్నమాటలో ఎంతో న్యాయమున్నదనిపించును కానిలోతుకు దిగిచూచినకాని నిజము తెలియదు-

మొదట దేశమందు సరకులను కొనువారలకు లాభమే కావచ్చును కాని విదేశపు పరిశ్రమల వారలు ఈవిధముగా పోటీచేయుటలో ధరలను అంతకంతకు తగ్గించుచుపోవుట మొదట మాత్రమే జరుగును. ఆపోటీలో శైశవములో నుండే మనదేశపు పరిశ్రమలుపడగొట్టబడినపిమ్మట ఆ చౌకధరల నింకను వారుంచెదరా? ఆవిదేశీయులు, అప్పుడు ఇంతకాలపు పోటీలో వదలుకొన్న లాభములకు రెండింతలనుకూడ వసూలు చేసికొనగలుగుదురు. కాబట్టి శైశవదశలోనుండు మన పరిశ్రమలకు పరుల పోటీని తగులనిచ్చుటవలన ఆఖరుకు మనదేశీయులు నష్టపడుటయే సంభవించును. మరియు అందువల్ల ఆఖరుకు మనదేశీయులు విదేశీయులకుఆర్థికముగ దాసులగుదురు. ఆర్థిక దాస్యము రాజకీయ దాస్యమునకు అనుకొనియుండు క్రిందిమెట్టు

ఆవిధముగా కాక, మనదేశములో పరిశ్రమలు మంచి పటుత్వము పొందు నంతవరకు వాటికి పరుల పోటీలేకుండ రక్షణ సుంకములను విదేశీయ దిగుమతులపై విధించి, ఆసుంకములవల్లవచ్చెడి ఆదాయమును వినియోగించి, దేశీయ పరిశ్రమాభివృద్ధిని గట్టిపరచినతర్వాత ఆ రక్షణ సుంకములను తీసివేయవచ్చును.

అయితే కొందరు పరిశ్రమలవారలు తుచ్ఛమైన పోటీలను చేయవచ్చును అనగా తమకు నిజముగా నష్టకరమైనను తమ సరకుల ధరలను ఎదుటివారిని పడగొట్టి నాశనముచేయు దురుద్దేశ్యముతో విపరీతముగ తగ్గించి పోటీ చేయుదురు. ఇట్టి పోటీవల్ల గొప్ప కీడుకలుగును. ఇట్టిపోటీలే యుద్ధములకు మార్గమును వేయునవి ప్రపంచశాంతిని దానివల్ల తమదేశశాంతిని కోరెడి వీప్రభుత్వమువారు గాని ఈ దుష్టమైన పోటీలను ఎన్నటికిని సాగనీయరాదు.

కార్మికుల కడుపుకొట్టక సరియైన వ్యవస్థ, శాస్త్రజ్ఞానమందు తెలివితేటలనుపయోగించుట వీటివల్లతక్కువ ఖర్చుతో సరకును తయారుచేయగలిగినవారితో పోటీ యావనదశకువచ్చిన పరిశ్రమలకు క్షేమకరము కావచ్చును అంతేకాని ఏస్థితిలోనైనను రక్షణసుంకముల పద్ధతి నాశ్రయించరాదను వాదము సమంజసముకాదు.

ఇంకొక విషయమునసర్ విక్టర్ సాసూన్‌గారుఎత్తిపొడిచినట్లుఆక్షేపించినారు.కొందరు పరిశ్రమలను స్థాపించబోవువారలు తమసరకులలో కొంతభాగమును ప్రభుత్వమువారు కొనవలెననికోరుచుండుట తప్పుపద్ధతి అనివారనినారు సర్‌విక్టర్ గారు మనస్సులో ఎవరినిఉద్దేశించిఅనినారో తెలియదు కానిఇట్లడిగినవారలు మేమెరిగినంత వరకుఈయుద్ధసమయమున విమానములనిర్మాణము, మోటారుల నిర్మాణము,నౌకల నిర్మాణముఇటువంటి వాటిని ప్రారంభించదలచినవారలే ఈవిమానములు మున్నగునవి యుద్ధసమయములో ప్రభుత్వము వారికే ఎక్కువగా ఉపయోగపడునది వాటిపై ప్రభుత్వమువారి కంట్రోలు కూడఉండును వారుమన దేశములో చేసినవాటిని అనలేకొననిచో మన పరిశ్రమలవారలు వాటిని తయారుచేసి ఏమిచేసి కొనవలెను? ఇటువంటి పరిశ్రమలు మనదేశములో నెలకొనవలెనని ఇదియే తగిన సమయము ఈసమయమున ప్రభుత్వము వారు అట్లుతయారు చేసెడిసరకులలో ఎక్కువభాగములను కొనిప్రోత్సహించుటయే ఆపరిశ్రమలను మనదేశమందునిల్పుటకు తగిన పద్ధతి.

ప్రభుత్వ ప్రోత్సాహమునువిషయమున విదేశముల యందుప్రభుత్వములు అవసరమైనపుడు తమపరిశ్రమల నెట్లుప్రోత్సహించుచుండునో గమనించిన చో సర్ విక్టర్ సాసూన్‌గారి సలహాలోని లోపము చూపుటకు ఉదాహరణలను కూడఇచ్చినట్లగును కానిఇప్పటకే వ్యాసముదీర్ఘమైనందు వల్లదానికి అవకాశములేదు

—

## ఆంధ్రభవన నిర్మాణనిధి

భవననిర్మాణకమిటి కార్యదర్శులు, శ్రీయుతులు బొజ్జం నరసింలు, వరకాంతము గోపాలరెడ్డి గార్లు వసూలుచేసిన విరాళములు,

వరంగలు

| | రూ. |
|---|---|
| శ్రీ అల్లాడికేదారిగారు | ౨౧౬ |
| ,, సిద్ధంసెట్టి లింగన్నగారు | ౨౧౬ |
| ,, కొండూరు రామలింగంగారు తెనుకటి రూ ౨౧౬ కాక | ౨౦౦ |
| ,, బెద్దె ముకుందముగారు వెలుగుపల్లి | ౧౫౧ |
| ,, పాటికేంకటకృష్ణారెడ్డిగారు రు ౧౦౦౦లో | ౫౦ |
| ,, పాటకద్న్యారెడ్డిగారు | ౨౫ |
| భోనగిరి | |
| ,, వరకాంతం నరసింహారెడ్డిగారు | ౨౦౦ |
| ,, సేట్ రాందయాలు కాలూరాంగారు | ౨౦౦ |
| ,, గాదెప్పయ్యగారు | ౧౦౦ |
| ,, పచ్చారాజయ్యగారు | ౧౦౦ |
| ,, మంచాల విశ్వనాథంగారు | ౧౦౦ |
| ,, ,, నారాయణగారు | ౭౫ |
| ,, జిగిని నారాయణగారు | ౫౦ |
| ,, ఇరాకుళ్ళ పత్తయ్యగారు | ౨౫ |
| ,, సిద్ధుల మల్లయ్యగారు | ౨౫ |
| ,, హీరాలాలుగారు | ౨౫ |
| ,, ఉప్పల మహాలక్ష్మీనారాయణగారు | ౨౫ |
| మొత్తము | ౧౬౪౩ |

వెనుకటి వసూళ్లు

| | |
|---|---|
| శ్రీ కుక్కడం పిచ్చయ్యగారు (వరంగల్) | ౧౧౬ |
| ,, జూకారెడ్డిగారు (ముస్తాల) | ౧౦ |
| ,, చిక్కపల్లి రామచంద్రరావుగారు హై. వకీలు నాగరకర్నూలు | ౧౦౦ |
| ,, సిద్దుల బాలయ్యగారి నరసయ్యగారు భోనగిరి | ౨౫ |
| ,, శ్యామరావుగారు సికింద్రాబాదు | ౨౦ |
| ,, బూర్గుల మక్తెదార్లు శ్రీ వేంకటేశ్వరరావుగారు | ౧౦౧ |
| | ౩౪౨ |
| మొత్తము | ౨౦౫౫ |

నేటివరకు వాగ్దానముల మొత్తము ౧౫౩౪౨-౨-౨

వసూళ్ల మొత్తము, ౧౦౪౩౪-౨-౨

వసూలు కావలసిన రు. ౪౯౧౧-౦-౦

౧౦ ఇసఫందార్ ౧౩౫౩ ఫ. } మహా. హనుమంతరావు. కోశాధిపతి

—

ఉస్మానియా విద్యాపీఠమువారు డాక్టర్ క్రిస్టాఫ్‌వాన్‌ఫూరర్ హైమెన్‌డార్ఫ్ గారిచే మనుష్యవర్ణనశాస్త్రము భారతదేశపు ఆదిమవాసులసంస్కృతులు, హైదరాబాదు సంస్థానపు ఆదిమవాసులు, వారల పరిపాలనకు సంబంధించిన సమస్యలు, ఆధునిక భావములపై మనుష్య వర్ణనశాస్త్రప్రభావము, జాతులనుగురించి సిద్ధాంతములు —ఈవిషయములను గురించి ఉపన్యాసము లేర్పాటుచేయించినారు మనుష్యవర్ణన శాస్త్రమునుగురించిన మొదటిఉపన్యాసము బాగెఅమ్మాలో పౌరహాలునందు ఫిబ్రవరి ౧౫వ తేదిన ఇవ్వబడును.

* *

హైదరాబాదు నగరమందు మున్సిపలుబజారు పోలీసులు ప్రభుత్వమువారికి వశపరచని ప్రాతతైరులను జప్తుచేయుచున్నారు

* *

హైదరాబాదు పురపాలకసంఘము యొక్క సలహాసంఘమునకు నవాబ్ రహమత్‌యార్ జంగు బహదర్, ఫరీదుకా సాహెబ్ గారలకు బదులు ముఖ్తార్ ఆలీఖాన్, మహమ్మదుయూనుస్ అను వారలు ప్రభుత్వమువారిచే నామకరణము చేయబడినారు

* *

ఫిబ్రవరి నెలలో ఢిల్లీలోజరుగనున్న అఖిలభారతదేశపు ఆర్యమహాసభకు హైదరాబాదు సంస్థానమునుండి ప్రతినిధులుగ పండిత వినాయకరావు గారును, ఇకను సుమారు ౧౦౦ మంది ప్రతినిధులును పోవుచున్నారు వినాయకరావుగారును నరేంద్ర గారును హైదరాబాదు సంస్థానఆర్యప్రతినిధిసభకు ప్రతినిధులుగా పోవుచున్నారు

* *

హైదరాబాదు (దక్కన్) నగరముతటను ఆహారపదార్థములధరలను ప్రభుత్వమువారు నిర్ణయించినధరలకు అమ్మనివర్తకులను పట్టుకొనుటకు హైదరాబాదు పోలీసులు చురుకుగా ప్రయత్నములను ప్రారంభించినారని ఒక "అసోషియేటెడు ప్రెస్" వార్తలోనున్నది కొందరువర్తకులను పట్టుకొన్నారు, కొందరిని చాలానుచేసినారు, కొందరికి జుర్మానాలు విధించబడినవి కొందరు వర్తకులు తమదుకాణములలో పనిచేయువరలపై తప్పుచుత్రోసి తామునప్పించుకొనుచున్నట్లు తోసి ప్రభుత్వమువారు దుకాణములలో పనిచేయువారలు చేసిన తప్పులకుకూడ దుకాణాల యజమానులనే బాధ్యులనుగ చేయునట్లు శాసనమును సవరించుటకై ఆలోచించుచున్నారు.

# విజ్ఞానవర్ధని.

## బలేచౌకబేరము

సామ్రాజ్యశక్తిలో ఉండినప్పుడు రోమసామ్రాజ్యం చాలా దుర్మార్గాలు చేసెను. అన్ని సామ్రాజ్యాలవలెనే దానికిన్నీ ఒకనాడు పతనంవచ్చెను వచ్చిననాడు అది అధఃపాతాళములో పడిపోయెను పర్టినాక్సు అను రోమచక్రవర్తిని ప్రభురక్షకభటులే (ప్రిటోరియన్ భటులు) చంపివేసి తామే సింహాసనమును వశపరచుకొనిరి ఎవరికిన్నీ తగవులేకుండా సామ్రాజ్యాన్ని అమ్మి వచ్చినపైకం పంచుకొందామని వారు తీర్మానించుకొని "బలేమంచి చౌకబేరము" అని పాట పాడిరి జూలియాను అను దీర్ఘసామంతుడు కోటీశ్వరుడు వేలములో అందరికంటె యెక్కువపాటపాడి ౧౦ లక్షల పౌనులకు రోమసామ్రాజ్యాన్ని కొనెను. రెండునెలలపాటు పైదీర్ఘసామంతుడు సామ్రాజ్యమును ఏలెను. కాని అంతలోనే సిపాయీల బుద్ధిమారెను "ఒకే మఖమంతా ఘనులమందరమండగా ఈకోమటి ఒక్కడే యింత సామ్రాజ్యాన్ని యేలేది యేమిన్యాయం" అని వారు కలబలుకుకొని చలో!అని రోమనగరమును ఆక్రమించి దీర్ఘసామంతుని గొంతుకోసిరి-

## చార్మినార్

గోలకొండ ఖుతుబుషాహకాలములో ఒకమారు తీవ్రమైన మారికోపద్రవము (కలరా)వ్యాపించి జననష్టము కలిగించెను- అప్పుడే పీర్లపండుగవచ్చెను- హిందూ ముస్లిము లేకస్తులై ఇమాంహుసేన్ గోరీరూపమగు తాజియా (ప్రభ)ను చేసి గంగాహిప్రీ మొహర్రం మొదటి తేదీనాడు ఊరేగించుట స్థాపించిరి. అప్పుడు మహమ్మదుఖులీ గోలకొండను పాలించుచుండెను- తాజియా పెట్టినచోటనే ఆదేరూపముతో చార్‌మినారును కట్టించెను- చారుమినారు వెడల్పు ౮౦ అడుగులు, పొడవు ౮౦ అడుగులు. ఒక్కొక్కమాను ౩౦ అడుగులయెత్తు ౨౫ అడుగుల వెడల్పున్ననీ మిద్దెపైనుండి ఒక్కొక్క స్తంభము (మినార్) ౭౦ అడుగుల యెత్తున్నది- భూమిఅడుగునుండి ఒక్కొక్కస్తంభము ౧౮౦ అడుగుల యెత్తున్నది- చారుమినారు పూర్తి అగువరకు ౯ లక్షల రూపాయీలు పట్టెను క్రీ-శ- ౧౫౯౨లో దానికి గచ్చుపనిచేసిరి-దానికిగాను ఒక లక్ష రూపాయీలు వ్యయమయ్యెను- చారుమినారు పైభాగమందొకదిక్కు మసీదు నమూనాయున్నూ ఒకదిక్కు దేవాలయము నమూనాయున్నూ నిర్మింపబడినవి- ఖుతుబ్షాహీల మతసహనమున కదొక చిహ్నము.

—

జనవరి ౨౦ తేదిన నిజాంప్రభుత్వపుసప్లయి కార్యశాఖ కార్యాలయమందు ఆహారపదార్థముల సలహాసంఘముయొక్క కార్యనిర్వాహకసమితి సమావేశము జరిగెను నల్లగొండ, మహబూబునగరములలో తిరిగిచూచివచ్చిన ముకుందలాలఅయ్యంగారు తాము తెలిసికొనినసంగతులను తెలిపిరి మహబూబునగరంజిల్లాలో కొన్ని తాలూకాలయందు తెల్లజొన్నలు తక్కువగా నున్నవనియు, ఇందుకుకారణము రైతులు ఆహారధాన్యముల పంటలనువేయక ఆముదాలను, వేరుసెనగలను వేసియుండుటయేననియు సభవారికి తెలుపబడినదట.

కట్టెలకరువువిషయము చర్చకువచ్చినది. అందుపై వరంగల్లు,ఆదిలాబాదు జిల్లాలనుండి ఆశోకొట్టజనులకు కట్టెలెక్కువగా పంపించుటకు ఏర్పాటుచేయబడినట్లు సభవారికి తెలియజేయబడినది

ఒకప్రశ్నకు సమాధానముగ సివిల్ సరఫరాల అధికారి ఒకజిల్లానుండి మరొకజిల్లాకు ధాన్యమును రవాణాచేయువిషయమున ఎట్టి నిరోధములును లేవనిచెప్పిరి.

ఆహారపదార్థముల మరియు సప్లయిశాఖ యొక్క ఆజ్ఞలన్నిటిని ప్రజలసౌకర్యమునకై ఒకపుస్తకముగా అచ్చువేయించగలమనియుఅధికారి తెలిపెను.

* *

హైదరాబాదు హరిజనసేవకసంఘముయొక్క ఇప్పటిస్థితినిగురించి ఆలోచించి దాని ఆర్థికస్థితిని బాగుచేయుటకును నిమ్నజాతులకు అన్నివిధముల సేవజేయుటకై నిమ్నజాతులయందు అభిమానముగల స్త్రీపురుషులందరి సహకారమును సంపాదించుటకును హైదరాబాదునగరమందు వై.యం.సి.ఏ. భవనములో ఈజనవరి౩౦వ తేదిన సాయంకాలము ౫గంటలవేళ శ్రీశ్రీ రాజాబహద్దర్ వెంకటరామారెడ్డిగారి అధ్యక్షతలో ఒకసభ జరుగునట్లు ఏర్పాటు చేయబడినది.

* *

ఉస్మానుషాహీ మిల్లుడైరెక్టరులు జనవరి౨౨వ తేది సమావేశమందు ఆమిల్లువాటాదారులకు మొత్తము ప్రతిశతి ౧౫వంతున లాభమునుండి పంచుటకుశిఫారసుచేసిరి

ఆజంజాహీ మిల్లుడైరెక్టర్లు ఆమిల్లు వాటాదారులకు మొత్తము ప్రతిశతి౩౦వంతున లాభమునుండి పంచుటకు శిఫారసు చేసిరి

* *

నిజాంరాష్ట్రములోనికి భారతదేశపు బయటినుండితెప్పించిన నూలునుగానిబట్టలనుగాని నిజాం ప్రభుత్వపు బట్టలకమీషనరుయొక్క వ్రాతమూలమైనఅనుజ్ఞ లేనిది బట్టలదిగుమతి వ్యాపారముచేయువారెవరుగాని ఉంచుకొనరాదని ఆధికారి తెలియజేసినాడు

* * *

సికిందరాబాదుఅధికారులు నిష్పదరిమ్రలకుధర్మముగాను, ఇతరచీదలకుతక్కువధరలను స్టాండర్డు బట్టను సరఫరాచేయుటకుగాను ఖర్చునుభరించుటకు పూనినారు సికిందరాబాదు ప్రాంతములో బిచ్చగాండ్రు, ఇప్పటికిలేని రాతలేవరైనన్నూ రోగులుకూడ వీరికి తెలుపవలెనదని అధికారులు 'సికిందరాబాదు రలీఫుఅసోసియేషను' వారికి ఆజ్ఞచేసినారు, కడమసారముగ విచారణజరుగుచున్నది.

*

యలెక్ట్రిక్ సంబంధమగు వృత్తులవిద్యలో గడతేరినవిద్యార్థులకు ప్రభుత్వపు యలెక్ట్రిసిటీశాఖలో ఉద్యోగములను సంపాదించుకొనువిషయమునను, యలెక్ట్రిషియనులుగా పనిచేయుటకు లైసెన్సులను పొందువిషయమునను చిక్కులుకలుగుచున్నవని ఆవిద్యార్థులపక్షమున విద్యాశాఖమంత్రియగు నవాబ్ సర్ మెహిదియార్‌జంగ్ బహాదర్‌గారికి మొలపెట్టుకొనబడియుండెను. ఆవిషయమునుగురించి సమగ్రమున విన్నవించుకొనుటకై విద్యార్థులపక్షమున కొందరుప్రతినిధులు జనవరి౨౨వ తేదిన నవాబ్ బహాదర్ గారివద్దకుపోయిరి. నవాబ్ బహాదర్ గారు ఆవిన్నపమునాలించి కారణకష్టములనుగురించి త్వరలో విచారణజరిపెదననిరి.

* *

హైదరాబాదు ప్రజాపక్ష విద్యామహాసభను రాయచూరులో జరుపుటకై అక్కడ జ్ఞమాధవరావుగారు అధ్యక్షులుగను, డి మాణిక్యరావు, విరూపాక్షప్పగారలు కార్యదర్శులుగనుగల ఒక తాత్కాలిక సంఘము ఏర్పడి ఆహ్వానసంఘము నేర్పాటు చేయుటకు యత్నించుచున్నది.

* *

హైదరాబాదునగరమందు ఆబిద్‌షాపు ఏరియాలో జనవరి౧౫వ తేదిన భిక్షావృత్తినిషేధశాసనమునుఉల్లంఘించినవారలరిఅను నేరమునకై గూమందిబిచ్చగాండ్రను పట్టుకొని ప్రధానగరమేజిస్ట్రేటు వద్దకు తీసికొనిపోగా, మేజిస్ట్రేటుగారు వారలకు ఇకముందు ఇట్లుచేయవలదని హెచ్చరికచేసి వదలిపెట్టిరి

* *

హైదరాబాదు (దక్కన్) నగరపు రేషన్ శాఖవారు పచ్చారిషాపుల దుకాణాలలో ఆహారపదార్థములు కల్తీజరుగకుండాను, సరకును దొంగతనముగా ఎక్కువధరలకు అమ్మకుండాను చూచుటకై ఏర్పాట్లుచేసినారు ౨౪మంది రేషన్‌ఇన్‌స్పెక్టరు అధికారులు రోజుకురెండుసారులు ఆదుకాణాలకు పోయి పరీక్షించుచున్నారు.

* *

అమెరికా సంయుక్తరాష్ట్రములనుండి ఇండియాయొక్క ప్రెసిడెంటుయొక్కప్రత్యేకనుండుటకై నియుక్తులైన యన్ కె కృపలానిగారు హైదరాబాదు (దక్కన్) నగరమునకువచ్చి కొన్నిదినాలుండి జనవరి ౨౨వ తేదిన వెళ్లిపోయిరి.

బ్రిటీషు యుద్ధమంత్రివర్గమందు ఇండియాప్రతినిధిగనియుక్తులైన సర్ ఫిరోజ్‌ఖాన్ నూన్ గారును ఇండియాప్రభుత్వపు సివిల్ డిఫెన్సుశాఖ డైరెక్టరు అను యన్.పై హెచ్ సిమన్సుగారును జనవరి౨౨వ తేదిన ఢిల్లీనుండి విమానములో హైదరాబాదు (దక్కన్) నగరమునకువచ్చి ౨౩వ తేది ఉదయము వెళ్లిపోయిరి.

ఎ హాడమమారికార్ నాదంగారు అఖిలభారతదేశపు కేంద్రప్రత్తిసంఘ సమావేశమునుహాజరగుటకై జనవరి౨౩వ తేదిన బొంబాయికిపోయిరి.

* *

కొన్నిస్థానికపత్రికల సంపాదకులు హైదరాబాదు రేషనునియమాలననుసరించి ఆహారపదార్థ సమస్యవిషయమున పత్రికలకువిధించబడిన నిర్బంధములనుగురించి జనవరి౨౨వ తేదిన ఇక్కడనొక్క సమావేశములో ఆలోచనలుచేసినారు, ఈవిషయమున వారలపక్షమున ప్రభుత్వమువారికి మొలపెట్టుకొనదలచినట్లు తెలియుచున్నది.

* *

# బరోడా మహారాజు

## మహారాణి యుండగా రెండవ పెండ్లి చేసికొనుట

---

## దేశీయ పత్రికలలో ప్రతికూల విమర్శలు

---

ఇప్పటి బరోడా మహారాజాగారు, తమకు శాంతాదేవిమహారాణిగానుండగా ఆమెవల్ల 3గురు సంతానముండగా, ఆ సంస్థానమందు ఎవరుగాని మొదటిభార్యయుండగా రెండవపెండ్లిచేసికొనరాదను శాసనము అచరణలోనుండగా, పిఠాపురపు మహారాజాగారి కుమార్తెయగు సీతాదేవిని సరళ పెండ్లియైనారు దీనివిషయమున దేశములో సంఘ సంస్కరణాభిమానుల ఆందోళన హెచ్చుచున్నది సీతాదేవి మొదట బెజవాడసమీపమునందుండు ఉయ్యూరుఎస్టేటుజమీందారుగారికి వివాహితయై యుండెను, వారివల్ల ఆమెకొక సంతానముకూడ కలిగెను, కాని తరువాత ఆమె ఇస్లాం మతములోకి మారెను, పిమ్మట ఆమె మదరాసు హైకోర్టుకుపోయి ఉయ్యూరుజమీందారు తనతోకూడ ఇస్లాంమతములోనికి చేరనిరాకరించినాడు కనుక తనకువిడాకులిప్పించవలెననికోరెను అట్లేవారు ఆమెకోరికను ఒప్పుకొనిరి. అంతటఆ మెవిడాకులిచ్చి, సరళ హిందూమతమునకు మారి బ్రహ్మసమాజ పద్ధతి ప్రకారము గైక్వారుమహారాజాగారిని వివాహమాడెను.

బరోడాలో ఏకపత్నీ వ్రతశాసనముక్రిందగా బరోడామహారాజాగారి ఈ రెండవవివాహము చెల్లునని ఆక్షేపణ, దానివల్ల కొన్నిచిక్కులుపుట్టినట్లు చెప్పుచున్నారు. బరోడాసంస్థానపు దివాను అగు సర్.వి.టి. కృష్ణమాచారిగారు తమఅధికారపదవికి రాజీనామానిచ్చినట్లు వ్యాపించినవదంతులను సంస్థానాధికారులు అసత్యమని నిరాకరించుచున్నారు,

బరోడామహారాజాగారి ఈవివాహమునుఆక్షేపించు విమర్శలపత్రికలలో ఎక్కువగావచ్చినవి. అందుపైపిఠాపురమహారాజాగారు ఒక ప్రకటన చేసినారు వారు ఆ వివాహమునుసంపూర్ణముగా తప్పనినారు. తాను ఆ వివాహమును ఆమోదించి యుండలేదనియు, తమమతము, తమనైతిక విశ్వాసాదర్శములపూర్తిగా ఇట్టిచర్యకు విరుద్ధములనియు పిఠాపురపుమహారాజాగారు తెలిపినారు, కొన్ని ఏండ్లనుంచి ఈసీతాదేవియను తనకూతురివిషయమై తనకేమియు ప్రసక్తిలేకుండెననియు, ఆమెనుతన యింటికికూడ రానీయకుండ వెలివేసితిమనియు, "ఆమె ఇస్లాంమతముమారుట, తనమొదటిభర్తను వదలివేసి, హిందూమతమునకు బ్రహ్మసమాజ పద్ధతినమారి, బరోడాప్రభువును వివాహమాడుట— ఇవినాకు గర్హ్యము" అనియు—వారు ఆప్రకటనలో తెలిపినారు,

పిఠాపురపు యువరాజాగారుకూడ ఈగొడవ యంతటియు తినకు అసమ్మతమైనదేననియు తనకు ఆమెతో ఎట్టిప్రసక్తిలేదనియు అభిప్రాయమును ప్రకటించినారు

'రిఫార్మర్' అను పత్రికయొక్క సంపాదకీయమందు ఈవిధముగ విమర్శవచ్చినది "ఇటువంటి పరిస్థితులువచ్చినప్పుడు లార్డుహార్డింజిగారు ఇదూరుసంస్థానపు పూర్వమహారాజాగారి రెండవవివాహమును ఆమోదించలేదు. ఆ స్వానాధిపతులు ఈవిధముగ వర్తించునప్పుడు లార్డువేవెల్ గారి వైఖరి ఏమిటో తెలిసికొనుటకు కుతూహలముగానున్నది బరోడాప్రభువు తనఆనాలోచితచర్యచే వారు స్వాకృతశాసనమునే ఉల్లంఘించిన వారైనారు ఇందువల్ల వారు ప్రభుస్థానమునయుండుటకు నైతికముగా అనర్హులగుచున్నారు.'

---

# బ్రిటను తన సరకులు అమ్ముడుపోవు దేశాలను వదలుకొనదు

---

బ్రిటనులో తోలు సామగ్రులను తయారు చేయు పరిశ్రమకును, దానికి సంబంధముగల పరిశ్రమకును తోడ్పడు ఏగుమతి సంస్థయొక్క జాతీయసమితివారు చేసినవిందులో బ్రిటిషు ప్రభుత్వపు విదేశ వ్యాపారశాఖ కార్యదర్శియగు హార్కోర్టుజాన్స్టోనుగారు ఇటీవలనిట్లు చెప్పినారు "బ్రిటను తన సరకు అమ్ముడుపోవుచున్న దేశములలో దేనినిగాని వదలబోయేదిలేదు వదలబోవుచున్నదని పలుమారులు వదంతులు పుట్టవచ్చును కాని అవియన్నియు నిరాధారములు"

---


## విత్తనములు

చలికాలపు [20] విధములైన కూరగాయల విత్తనములు రు. 4. లు
12 విధములైన పుష్పవిత్తనములు రు.1-8-0
ది పూనా సీడ్ ఏజన్సి
288, రాంకోట్, సుల్తాన్ బజార్.
హైదరాబాదు దక్కన్.



నపుంసక వీరో
## ఎ. పి. యాకుటి
నవయౌవనం, దేదీప్యమాన పటుత్వం చేకూర్చు దివ్యౌషధం రక్తమును పరిశుభ్రపరచును. ధాతుపుష్టికలిగించును. క్షీణించిన నరములకు పటుత్వము చేకూర్చును వివాహితులకు సంతృప్తి, ఆనందము కలుగజేయు శక్తివర్ధకము వెల సీసా రు 10/-
మదనమంజరీ ఫార్మసీ,
184, చైనాబజారురోడ్, మదరాసు
కర్నూలు —కె యస్ కోవిరి & సన్సు.
అమ్మాంపేట్టు —బి రామకృష్ణయ్య & సన్సు.
మహబూబునగర్ —యస్ ముత్యాలు & సన్సు
పురణ్ దాస్ రణఛోడదాస్ సన్సు,
చార్ కమాన్, హైద్రాబాదు మరియు
జనరల్ బజారు, సికింద్రాబాదు.



RANIPEN
RANIPEN
SALES ASSOCIATION



"స్వయముగా శుభ్రపరచు" నురుగుయొక్క రహస్యము ఏమి?

సన్లైట్ సబ్బు పుడకపెట్టు మరియొక పనివారు జవాబు చెప్పుచున్నారు

"స్వశక్తి" యే స్వయముగా శుభ్రపరచు సబ్బుయొక్క రహస్యము ఈ శక్తియే నురుగును మురికిబట్టలనుండి మురికిని స్వయముగా తీయుటకు తోడ్పడు చున్నది 'స్వశక్తి' గల సబ్బు మైలను బట్టుకొను చున్నది సన్లైట్ నురుగులో బట్టలను ముంచి పిండిన ఈ స్వశక్తి పనిచేయ నారంభించు చున్నది నీటిలో బాగుగా కడిగిన వెంటనే మురికియు నురుగుతో పోవుచున్నది

## సన్లైట్ సోప్
స్వయముగా పనిచేయు నురుగుగలది

SUNLIGHT SOAP

S 66-33 TL

లివర్ బ్రదర్సుచే తయారు చేయబడినది



## "నేను చనిపోతానని ఎవరన్నారమ్మా?"

కోపగించుకోకు, బిడ్డా ఎవరో జమ్మిగారి 'లివర్ క్యూర్' సంగతి తెలియనివారు అన్నారులే,

## జమ్మిగారి లివర్ క్యూర్

శిశువుల లివర్, స్ప్లీన్ వ్యాధులకు ఆశ్చర్యముగునివారిణి
అన్నిచోట్ల అమ్మబడును.
జమిత వెంకటరమణయ్య అండు సన్స్
హెలాపూరు, మద్రాసు హెడ్ ఆఫీసు కుంభకోణం (యస్ ఐ రైల్వే)
బ్రాంచీలు బొంబాయి, కలకత్తా, లక్నో, తిరుచినాపల్లి, బెంగుళూరు, విజయనగరం.


# ధరల నియమమునకై ఇండియాప్రభుత్వ ప్రథమచర్య

---

బ్రిటిషుయిండియాలో అన్ని టికినిమూలములైన టోకు విక్రయసంస్థలవద్ద సజ్జలను, జొన్నలనుతమ ఆజ్ఞచే తెలుపబడుధరలకంటె ఎక్కువధరలకు అమ్మకుండ దండశాస్త్రానుగుణమైనదిగా భావించుటకు ఇండియా ప్రభుత్వమువారు నిర్ణయించినారు, దొడ్డుధాన్యములకు కూడ ఇట్లే ఏలధరయుండునట్లుశాసించవలెనో ఇప్పటికి ఒకమాటఆలోచించియున్నారు. అమట్టమునకు రాష్ట్రములలో ధరలను తగ్గించవలెనని రాష్ట్రప్రభుత్వములను కోరుచున్నారు. దీనితరువాత నిర్ధారణగా ధాన్యముధరలను శాసనముచే నిర్ణయించగలరు

---

# బ్రిటిషు పెట్టుబడిదారులకు బిర్లాగారి బెదరింపు

---

లండనునగరమందు ప్రకటితమగు 'న్యూస్ క్రానికల్' పత్రికయొక్క ఢిల్లీవిలేఖరి జి పి బిర్లాగారితో మాట్లాడగా బిర్లాగారు చెప్పిన సంగతులు ఆపత్రికయందు ఇటీవల ప్రచురించిన ప్రకటించబడినవి. బిర్లాగారు ఇట్లుచెప్పిరట. "బ్రిటిషువారి సాహాయ్యము, మూలధనము మాకు లభించిన యెడల మంచిదే లేనిచో వాటిని మేము మరొకచోటినుండి సంపాదించుకొనగలము బ్రిటిషువారి సాహాయ్యమున్నను లేకున్నను భారతదేశములో పరిశ్రమల అభివృద్ధి జరుగవలెను

---

## తుదకు కేంద్రమునకు పంజాబులొంగుట

---

పంజాబుప్రభుత్వమువారు ఆహారధాన్యములను రేషను ప్రకారము అమ్మించుపద్ధతిని, ధరలనుకంట్రోలు చేయుపద్ధతినిఒప్పుకొనజాలమని మొదటినుండియు, ఇండియా ప్రభుత్వము వారిసూచనకు అభ్యంతరము తెలుపుచుండిరి కాని ఇప్పుడుతుదకు పంజాబు ప్రభుత్వమువారు ధరలకంట్రోలుపద్ధతికి ఒప్పుకొనినట్లున్నది ఆరాష్ట్రములో రెండుచోట్ల ఇటీవలనుండి సజ్జల, జొన్నలధరలకంట్రోలు ఏర్పాటుచేసినారు తక్కిన విక్రయస్థానములలో కూడ సజ్జల, జొన్నలధరలకంట్రోలుకు ఏర్పాటుచేయనున్నారు.

---

# కాంగ్రెసు సేవకుడు పురపాలక సంఘాధ్యక్షుడగుట

సేలము పురపాలక సంఘము క్రొత్తపద్ధతిలో ఏర్పాటు చేయబడినది దానికి అధ్యక్షుడుగ మైసూరుసంస్థానపు కాంగ్రెసుచే అభ్యర్థిగ సూచితుడైన యం.ఏ గోపాలస్వామి అయ్యంగారు ఎన్నుకొనబడినారు

---


శ్రీజగదీశ్
విశ్వమోహిని
డైరెక్టర్ వైవిరావు

త్వరలో రానున్నది
# విశ్వమోహిని

మంచి మంచి దృశ్యములుగల మనోరంజకమైన గొప్పతెలుగు చిత్రము దీనిని చూచినతరువాత మీరు ఇతర చిత్రములను మరచిపోవుదురు మరియు మరల మరల దీనినే చూచెదరు

నటీనటులు, వైవి రావు నాగయ్య, లలితాదేవి, రాజరత్నం గంగారత్నం, మొదలగువారు

ప్రతిదినము రెండుఆటలు 6-30 ఘంటలకు రాత్రి 10ఘంటలకు

## ఆర్గస్ టాకీస్

టిక్కెట్లువివరములు
నేల 0-3-0
గ్యాలరి 0-5-0
కుర్చీ 0 8-0
సోఫా 1-0 0

నారాయణగూడాడిపో సమీపమున హిమాయత్ నగం రోడ్



## శ్రీరామకృష్ణ ప్రకృతి చికిత్సాలయము

మునులతోట రేపల్లె తాలూకా గుంటూరుజిల్లా.

---

యిచట ఔషధములు ఆపరేషన్లు, యింజక్షన్లతో నిమిత్తము లేకుండ యోగవ్యాయామ, వివిధ ప్రకృతి చికిత్సావిధానములచే కుష్ఠు, బొల్లి, ఉబ్బసము, క్షయ, మూర్ఛలు, పిచ్చి, నపుంసకత్వము, వంధ్యత్వము, మరియు సుఖవ్యాధులు మొదలగు మానవులకు సంక్రమించు సమస్తశారీరక, మానసికరుగ్మతలు నివారింపబడును మరియుస్థూల దేహులు సన్ననివారుగను, దుర్బలశరీరులు బలిష్టులుగను, అందవికారులు సౌందర్యవంతులుగను చేయబడుదురు సుఖప్రసవమును గోరుగర్భవతులు ప్రసవించుటకు 2 3 మాసములుముందుగా చికిత్సాలయమునకు చేరుకొనవలెను.

వివరములు కోరువారు 0-6-0 పోస్టుబిళ్లలు పంపిన "ప్రకృతి వైద్యము" గ్రంథము పంపబడును



## నవలలు-నాటకములు-కథలు

నవల అనిన ఒకని జీవితమును రసవంతముగా వర్ణించునది. నాటకము అనిన ఒకని జీవితమును చమత్కారముగా చూపించునది కథ అనిన ఒకని జీవితమునందలి రమ్యమైన ఒక ఘట్టమును వివరించునది. సరస్వతీగ్రంథమండలివారి 45 నవలలు, 11 నాటకములు, 25 కథలపుస్తకములు ఇంతవరకు వెలువడినవి సరస్వతీ పవర్ ప్రెస్ రాజమండ్రి



పేజీలు 1168 **వస్తుగుణప్రకాశిక** వెల 5-0-0

ఆయుర్వేదభూషణ, భిషగ్వర శీటూరివారు దేవనాగరిలిపిరచితము,సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లములలో మూలికల పేర్లును, తెలుగువచనమున వాటి ఉత్పత్తిస్వరూపములు, రసవీర్యవిపాకములు, గుణములు, గొప్పఔషధయోగములు ఇందు కలవు. ఇది గుణములు వర్ణింపబడినవి. రు. 5-0-0 మనియార్డరుపంపి దగ్గర రైలుస్టేషను తెలుపవలెను చార్జీలు మేమే భరించి పుస్తకము పంపుదుము. సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి ఆంధ్రా సెడి

చందా వివరాలు
సంవత్సరము చందా 6 హాలీ రూపాయలు
ఆరునెలలకు „ 3-౧౦-౦ „
బ్రిటిషిండియాలో సం॥ చందా 7 కల్దారు
విడి ప్రతిక ౦-౧-౨
పాత పత్రిక వెల ప్రత్యేకము

Vol. 18 — No 72

# గోలకొండపత్రిక
# Golkonda Patrika

*Published on every Monday and Thursday· Hyderabad· Dn·*

The only Popular Paper that reaches the masses in the Dominions
BEST MEDIUM — FOR — ADVERTISEMENT

27 — 1 — 1944


# బెంగాలు క్షామదేవత
# రెండవ నోము ప్రారంభము

## పంట హెచ్చినదనినా, కలకత్తాలోకి క్షుద్బాధితుల గుంపుల రాక

అంధేనుహగరమునుండి ప్రకటితమగు 'న్యూస్ క్రానికల్' అను పత్రికలో డాబిక్రాత్త ఢిల్లీ విలేఖరి పంపగా వేయబడినవార్త బెంగాలువిషయమై ఘర ఆందోళన కలిగించుచున్నది

"వరిపంట హెచ్చినను వట్టికరువువల్ల బెంగాలులో ఇంతవరకే చాలినంత ఆహారము లేనట్టియు రోగగ్రస్తులైనట్టియు లక్షలకొలదిమంది జనులు పూర్వముకంటె ఎక్కువబాధ ననుభవించవలసి వచ్చేటట్లున్నవి. గండం గడిచిందని కొద్దివారాల క్రిందటనుకొనినవారలు వాడిపోయినవి. ఇంతవారు పంటను చేర్చి సరిగా జనమునకు పంచుటకు బెంగాలు ప్రభుత్వము వారు ఏర్పరచిన విధానము స్థానికాధికారుల అసామర్థ్యమువలన మంచిఫలితము నిచ్చుటలేదు. కేంద్ర ప్రభుత్వమువారు రాజ్యాంగ శాసననియమములను భంగపరచరాదని చూచుచు ఈపరిస్థితిని సాగనిచ్చుచున్నారు.

"ఇవరలో కరువు ఎక్కువగా ఉండినపుడు ఆహారముకొరకై వేలకొలదిగా కలకత్తాకు చేరియుండి తర్వాత పంటలకోతలకు గ్రామాలకు పోయియుండిన వేలకొలది జనులందరు మళ్లీ కలకత్తామీదికి వచ్చిపడుచున్నారు" అని ఆపత్రికలో తెలుపబడినది

జనవరి ౧౫వ తేదితో ముగిసినవారమందు కలకత్తాలో గతిలేక తిరుగుచుండి మరణించినవారల సంఖ్య ౩౭ అని కలకత్తా కార్పొరేషను లెక్కలలో తెల్పబడినది. జనవరి౭వ తేదితో ముగిసిన వారంలో ఇట్టిమరణములసంఖ్య ౩౦౫, అంతకు పూర్వ౫రములో ౨౬. వరుసగా ఈహెచ్చుట గమనించదగినది. దీనికికారణము జిల్లాలలో ఆహారపదార్థముల కరువు ఇంకను ఎక్కువగా ఉండుట వల్ల గతిలేనివారలు గుంపులుగా కలకత్తా నగరంలోకి వచ్చిపడుచుండుట యని చెప్పవచ్చునని కలకత్తా కార్పొరేషనుయొక్క ఆరోగ్యాధికారి తెలిపినాడు

——

## ఆహారధాన్యముల కంట్రోలు

మ. ఘ. వ. నిజాంప్రభుత్వ సరఫరాశాఖనుండి ఈక్రిందివిధముగా ప్రకటనచేయబడింది

ప్రభుత్వమువారు గుడ్డ,బెల్లము,పశువులు మొదలైనవిచౌకగా దొరకనట్లుచేయ ప్రయత్నించుచున్నారు.కాని ఎన్నాళ్ళుఆహార ధాన్యములధరలు తగ్గవోఅంతవరకు తక్కినవస్తువుల ధరలుతగ్గవు.

ఆహార పదార్థముల ధరలువాటిఇష్టము వచ్చినట్లుపెరుగుటకును, తగ్గుటకునువిడిచిపెట్టినచో చిన్నరైతుకు దానివల్లలాభము లేదు. రాజ్యములో చిన్నరైతుల సంఖ్యయే హెచ్చుగా నున్నది.చిన్నరైతుతనపంటను అమ్మకుండానిలువ చేసిఉండజాలడు.పెద్దరైతు, వర్తకుడుధాన్యములను దాచియుంచిధరలు హెచ్చించునప్పుడు అమ్మకొని లాభములను పొందుదురు.

చిన్నరైతుకుఅతని పంటయొక్క సరియైనధరఅతనికిదొరకవలెనని యు, పౌరులు,గ్రామకూలి జనము తిండిలేకుండా ఉండకూడదనియు ప్రభుత్వము వారుకోరుచున్నారు.

అందుచే ప్రభుత్వమువారు రైతుయొక్క పంటలోకొంతభాగమును న్యాయమైనధరకు కొనినట్లు కొన్నధాన్యములు బలముపైబజారు ధరలనుకట్టు బాటుచేయుటకై ప్రయత్నించుచున్నారు.

ప్రభుత్వమువారు ఏర్పరచినధరలు యథార్థమునకు పూర్వపుధరలకంటె రెండింతలు.

రైతుల దగ్గరనుండి ఎకరమునకుపల్లపు పంటలో ఐమణుగుల ధాన్యము,ఇతరదినుసులు తెలంగానాలో ఎకరమునకు అర్థమణుగు, మరట్వాడా, కర్ణాటక ప్రాంతములలో ఒక్కొక్క మణుగుచొప్పునప్రభుత్వమువారు కొనుచున్నారు. పటేలు పట్వారీలు, గ్రామపెద్దలు కూడినఒక పంచుత ధాన్యములను కొనితహసీల్ గోదాములలో జేర్చెదరు.

సర్కారీ గోదాములలోచేర్చబడిన ఆరోజో జుగాని,దానితరువాత దినముకానితహసీలు ఖజానునుండి పంచులకుధాన్యము ధరఇవ్వబడును.

పంచులువారి గ్రామమునకువరలిన వెంటనే రైతులకువారికరి బాకిడబ్బును ఇచ్చిరసీదు పొందవలెను.

ప్రతిరైతుకు అతనికిరావలసిన డబ్బుపూర్తిగా అందుచున్నట్లు నిగరాని చెయుట సర్కారీఉద్యోగులవిధి.

పంటచెడిపోయి నప్పుడుస్థానిక మాల్గుజారీ ఉద్యోగులుపంట నుండిప్రభుత్వమునకు అమ్మవలసినభాగములో రియాయతునిత్తురు

ఏదైనప్రాంతములో ఆహారదినుసుల కొదువ ఏర్పడినచో ఆప్రాంతమునకుసర్కారీ గోదాముల నుండి ఆహారదినుసులు ఇవ్వబడును.

——


9 డిశెంబర్ 1943 నుండి ప్రారంభము

మినర్వావారి అత్యద్భుత చారిత్రిక చిత్రము

పృథ్వీవల్లభ్

ప్రఖ్యాత దర్శకుడు నటకుడు అయిన

సొహరాబ్ మోడి

దర్శకత్వము

నటీ నటులు:—
సొహరాబ్ మోడి— దుర్గాఖోటె—మీన
సాదిఖ్ అలీ— అమీర్ బాయి—
మొదలగువారు—

నిషాత్ సినిమా
పుత్లిబావులి
హైదరాబాదు


## భోజరాజు- పోతరాజు

భోజరాజెక్కడ- పోతరాజెక్కడ అన్నట్లుగా భారతదేశము ఇంగ్లండంత ౧౨ అంతల దేశం అయితే మాత్రమేమి? మనది దరిద్రదేశం. ఇంగ్లీషుదొరలది నందనవనం. అమెరికా సంయుక్తరాష్ట్రం ప్రపంచంలో నెల్లాధనవంతమగుదేశం, దరిద్రుడు, కోటీశ్వరుడు,' అందరిఆదాయంకలిపి మొత్తంజనసంఖ్యమీద విభాగించితే యీక్రిందివిధంగా లెక్కలు తేలును. అమెరికాలో ప్రతివానిసగటు

| | | |
|---|---|---|
| ఆదాయం సంవత్సరానికి | రూ | ౧౧౨౦౦ |
| ఇంగ్లాండులో | „ | „ ౯౨౦ |
| హిందూస్థానములో | „ | „ ౭౨ |

## పాకిస్థాన్ అమలు ప్రయత్నము

సింధురాష్ట్రి ముస్లింలీగుయొక్క అధ్యక్షుడగు జి యం. సయ్యదు గారు సింధురాష్ట్రి ముసల్మానులకు ఇట్లు విజ్ఞప్తి చేసినారు.

"సింధురాష్ట్రము పాకిస్థానులో ఒక ముఖ్యమైనభాగము. అందువల్ల దాని ఆర్థికస్థితిని బాగు చేయుట చాలఅవసరము, ఇప్పుడు ఈరాష్ట్రి జనులు వాడుకొను బట్టలలో ఎక్కువభాగము మదరాసు, బొంబాయి, అహమ్మదాబాదువిదేశములనుండి వచ్చుచున్నది. ఈరాష్ట్రములో బట్టల మిల్లులను పెట్టగలుగునం-తవరకు ఇక్కడి ముసల్మానులు ఇక్కడిచేతపనివారలు నేసిన బట్టలనే కొని వాడుచుండినచో,బట్టలకై ఈరాష్ట్రిధనము బయటికిపోదు, మరియు ముస్లిం చేతపనివారలకు బ్రతుకుతెరువు కలుగును.

——

## ఇండియా స్వాతంత్ర్యము అమెరికనులకు కాబట్టదు

అమెరికా సంయుక్తరాజ్యపు 'రిపబ్లికన్‌పార్టీ' నాయకులలో నొకరగు సెనేటర్ రాబర్టు ఏ టాఫ్టుగారు యుద్ధానంతరము సంయుక్తజాతులతో సంబంధమునందు తమరాజ్యప్రభుత్వ విధానమును వివరణచేయుచు జనవరి ౧౩వ తేదిన ఇట్లు చెప్పిరి-' భారతదేశ స్వాతంత్ర్యమునకైగాని; బాల్టిక్ రాజ్యముల, లేక తూర్పుపోలాండు యొక్క స్వాతంత్ర్యములకైగాని ఒత్తిడిచేయవలెనను అభిప్రాయము మాకు లేనేలేదు."

——

## దఫ్తర్ అదాలతు ఆలియాసర్కారెఆలి

నిషాన్ ౧౪౯౯ ౫౧౯౩.

వాది— ర వర్హాల్ శంకరయ్య
ప్రతివాది- వచ్చల్ సత్తెమ్మ వగైర

బనాము గలిగెల భుల్లయ్య వల్దు నరసయ్య కులము బ్రాహ్మణుడు వయస్సు ౩౦ సం॥లు.వృత్తి ఖాన్గి పైరవికార్, సాకీన్ తాలూకా మంథెని మహాదేవ్ పూర్,జిల్లా కరీంనగర్— ఈఅభియోగ ముకరీంనగర్ మున్సిఫ్'గారి తజ్వీజుపై నారాజుతోఅదాలతుల్ ఆలియాయందుమురాఫా గా.౫౪౯-౫౨పేష్ కాబడితారీకుపేషీనిర్ణయించబడి నీపేర సమన్ తీయబడినది కానీనీపతా తెలియనందున సమన్ తామీలు కాలేదు. మురాఫా యొక్కడర ఖాస్తుపైన ప్రకటన మూలంగా తెలియ జేయడము ఏమనగా ౧౯ఫర్వర్డి సోమ వారము రోజున అదాలతు అలియాలో జల్సముతఫిఖయందు హాజరై పైరవిలేక జవాబుఇచ్చుకొనవలెను. హాజరుగాని పక్షమున ఏక్‌తరఫా ఫైసలా చేయబడును.

మదద్గార్ మోతమద్
మజ్లిస్.


వాస్వాని ఆర్టు ప్రొడక్షన్సువారి

అత్యుత్తమ చిత్రము

29 జనవరి 1944 నుండి ప్రారంభము

# సహారా

దర్శకుడు
జె. పి. అద్వానీ



ఉత్తమమైన ప్రేమగాధ
రసవత్తరమైన ఘట్టములు,
మధురమైన గానములు
ఉన్నతమైన ఆదర్శము

తారాగణము:—
రేణుకాదేవి, నారంగ్
ప్రాణ్, శారదా

ప్రతిదినము రెండాటలు సాయం. 5-30 రా. 8-30 (శుక్రవారము మ్యాటినీలు)

రాయల్ సినిమా
సుల్తాన్ బజారు, హైదరాబాదు

గొప్ప తగ్గింపు.

కొద్ది నిలువ మరియు కొద్దిరోజులే యున్నవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇంగ్లీషు | ప్రింటెడ్ లాన్ | 36" | రు. 2/- | గజము నిఖరము | ధర |
| „ | „ కాంబ్రిక్సు | 36" | రు. 2/4 | „ | „ |
| „ | „ హేర్ కార్డు | 36" | రు. 3/8 | „ | „ |
| „ | „ ఆర్గండై | 36" | రు. 4/10 | „ | „ |
| „ | „ వాయిల్ | 44" | రు. 2/- | „ | „ |

మొత్తం ప్రింటుచేయబడిన జార్జెట్ చీరెలు
6 గజములు............... రు. 56-12-౦ ప్రతిచీర నిఖరము ధర

మరియు ఇతర అన్నివస్తువులపైన కూడా నూటికి 12½వంతున తగ్గింపు చేయనైనది.

తొందరగా కొని లాభము పొందండి

కేవల్‌రామ్స్
ది వైట్ షాప్
కింగ్సు వే,
సికింద్రాబాదు-దక్కన్

Khan andSons

కృతజ్ఞతాభి వందనములు

1943 సం. లో అపూర్వ వ్యాపారాభివృద్ధి

పట్టాలు జారీచేయబడిన క్రొత్తవ్యాపారము రు. 54,౦౦,౦౦౦లు మించినది

ఆంధ్రఇన్షూరెన్సుకంపెని, లి.

ప్రధాన కార్యాలయం: మచిలీపట్నం
ఆఫీసులు.- తంబుచెట్టి వీధి.,మద్రాసు, ఎర్నాకులం, అనంతపురం, బెజవాడ, సికింద్రాబాదు, బరంపురం, గంజాం, నాగపూర్, కలకత్తా, లాహోరు, వ॥
వివరములకు క్రిందివారికి వ్రాయుడు:—

గా. జగన్నాధం, చీఫ్ ఏజంటు,
కింగ్సువే, సికింద్రాబాదు.

బసచేయుటకు

ది రాయల్ హోటల్

ఫోన్ నం. 3462
హైదరాబాదు దక్కన్

Khan and Sons



Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad-Dn. Editor S. Prathap Reddy, B A., B. L.